మంతునికిఁ బ్లవంగత్వము సిద్ధించియుండనోపు. మాయం దేమిదోష మున్నది?

భీము—లేకేమి? ఆమహావీరుం డింతమాత్రముచేతనే తిరస్కృతుం డగుఁగా? సీతాన్వేషణమందును కకుత్స్థవంశరత్నంబులగు రామలక్ష్మణుల జీవదానమునందును, ఆమహామహుబాహువులు దక్షిణోత్తరదిగంతంబులవఱకు వ్యాపించియుండ లేదా?

హను—(తనలో) ఇతని భ్రాతృప్రేమ వర్ణనాతీతముగదా? నేఁ గొంచెము చేసినను దానిం గొప్పగఁ బ్రశంసించుచున్నాఁడు. నేను సోదరుండనని తెలిసిన, నిజముగ సంతోషమూపఁజాలఁడు. యుధిష్ఠిరునందుకంటె నాయం దెక్కుడుప్రేమఁ గన్పఱచుచున్నాఁడు—మరియు కఠినభాషణేంధనములచే నీతని కోపానలజ్వాల నించుక ప్రజ్వలింపఁజేసెదఁగాక! (ప్రకాశముగ) ఎవని శరీరము జ్యావావృథివియొక్క నాస్తికత్వమును దెలియఁబఱచుచున్నదో, ఎవ్వని యుదరమునఁ బాతాళము కుళీరగర్తతుల్యముగనుండెనో, ఎవ్వనిచే నెల్లసముద్రములు లంఘింపఁబడెనో, అట్టి మహావీరుఁడు కోఁతియనికదా చెప్పుచున్నాఁడవు—ఇది నమ్మదగిన విషయమా? ఇట్టివాఁడు లోకమునను౦డునా? ప్రపంచమునఁజూడ నిది యొక కళంకముగ నున్నయది.

భీము—ఓయి! నీవు చార్వాకునింబలె నిర్వివేకహృదయుండవగుచున్నాఁడవు. దేవతలచే సైతము శ్లాఘ్యములగు వాయునందనుని కథలయందు నీవే హేతువుచే సందేహపడుచున్నాఁడవు? చూడుము. సముద్రము నాఁడందిన భయాకంపము నిప్పటికిని దరంగఘోషలమూలమునఁ గన్పఱచుచున్నయది.

హను—(ఆక్షేపణగ) ఏమి నీ ప్రమాణరహితమగు నుపన్యాసము!

భీము—అట్లనకుము. ప్రత్యక్షముగ నిర్ణయించుటకు శక్యముకాని దాని నిప్పు డనుమానప్రమాణముచే నొకత్రుటికాలముననే చెప్పి నిను నమ్మించఁగలను.

హను—సరి. అట్లయిన నంగీకరించెద.

భీము—ఓయి! జలరాశిలంఘనసమయమున నామహానీయుండు
గన్పఱచిన శరీరభారముచే భగ్నమైన శిఖరములగల మహేంద్ర
పర్వతము దక్షిణదిక్కున నిప్పుడు సాక్ష్యమిచ్చుచుండ లేదా?

హను—(తనలో) ఈతుఱ్ఱండు బాగుగఁబల్కెడిని. ఇదియు నంగీకరిం
పక తిరస్కరించి యడుగఁగలను. (ప్రకాశముగ) ఓ భీమసేన!
నీ విప్పుడు చెప్పినది నేనమ్మఁజాల. ఇట్టివాఁడు హనుమంతుండేయని
నేను గౌరవించను.

భీము—ఎవ్వండవు నీవు? ఎన్నఁడు విననట్టి సంభాషణము జేయుచు
న్నాఁడవు. లంకాపట్టణమున గొప్పసాహసము గనుపఱచినవాఁడు.
రక్షఃప్రియారోదనస్వాధ్యాయప్రణవోపదేశగురుండు. కపిరాగ్రే
సరుండు. శూరుండగు నక్షయు మర్దించి దశకంఠుని శోకసంతప్త
హృదయుం జేసినవాఁడు. అట్టి హనుమంతుం డెవ్వనిచే సన్మానింపఁ
బడఁదగఁడు?

హను—ఓహో! ఎన్నఁడు విననిది. అపూర్వము! తుచ్ఛుండగు నొకా
నొక రాక్షసశిశుమర్దనమా చేసినది? భీమసేనా! ఇదియేనా?
అక్షయుని రణరంగమున నుదగ్రముగ జయించినాడని చెప్పితివి.
అంతమాత్రమున హనుమానునియం దెట్టి పరాక్రమము నంగీకరించి
తివి!—ఇంద్రజిత్తుకూడ నతనిచే నర్దింపఁబడెనేని యట్లైనఁ గాని
యామాట కాతండు తగియేయుండును. కాని యింతమాత్రము చేతనా
యిట్టిపొగడికలు! కష్టము కష్టము—మీఁదుమిక్కిలి యింద్ర
జిత్తునిచే సంగరరంగమున నాఁడు దానివలె బందీకృతుండైనవాఁడు.
అట్టి నాతనికి శత్రువలనఁ గల్గిన పరిభవముకన్న మరణమే
మేలుగదా!

భీము—(సకోపాట్టహాసముగ) ఓ శాఖామృగమా! జ్ఞానహీనుండవగు
టచే నిజమగు ప్రౌఢత్వమును స్తోత్రము జేయక మీఁదుమిక్కిలి
వ్యతిరేకమగుదాని శ్లాఘించుచుంటివి. జ్ఞానలవము గల్గిన నీవీ

త్రికున వ్యతిరేకసంభాషణము చేయుము. ఒకే పక్షమున సంభాషించుచుంటివి. పెద్దలయెడ నీవిటుబాడుట పాడిగాదు. మరియు, నోదుర్విదగ్ధా! హనుమంతుండు తన బాధనము తనంతఁదానె యభినయించె. లేకున్న నూప్తరింద్రజిత్తుఁడు వచ్చినను హనుమంతుండు బద్ధుండగునా?

హను—ఔనౌను. నిజము గుర్తెఱుంగనివారిట్లే పలికెదరు. ఇంతకన్న లజ్జాకరమగు కార్యము హనుమంతునకు వేరొకటి కలదా? ఒక్క క్షణమున నిర్జరబృందముతోడ నింద్రుని జయించిన యింద్రజిత్తుచే నాంజనేయుండు బందీకృతుండయ్యె సుమా! ఏల యనవసరముగ దాని దాచెదవు? ఇంద్రునికంటె నాంజనేయుం డధికుండా?

భీము—శత్రునిచే బలాత్కారముగ హనుమంతుండు బంధింపఁబడినట్లు తలంచుచున్నాఁడవు. కాని యక్షయకుమారుని మారిత్రము నిర్జించుట కొరునికి శక్యమగునా?

హను—(నవ్వి) విభీషణానుగ్రహమున హనుమంతుండు బ్రతికె. విభీషణసంభాషణము రావణు నరికట్టె. లేకున్న సుతద్రోహియగు హనుమంతునిఁ జంపుట రావణునికెంత? సహనమే లేకున్న జంభాసురాది దిక్పాలుర శిక్షించిన రావణునిచంద్రహాసము సహించియుండునా?

భీము—(కోప మభినయించును.)

హను—(తనలో) ఇదియేమియాశ్చర్యము! పండ్లుగిటకింపుచున్నాఁడు. నేత్రములు రక్తిమ నొందుచున్నయవి. అధరముకొరుకుచున్నాఁడు. కపోలములు చెమ్మటపట్టుచున్నయవి. కనుబొమలు ముడిపడుచున్నవి. ఈ వికారము ముఖమందలి కోపారంభము చెప్పక చెప్పుచున్నయది. నాపైఁబడునని యనుమానమగుచున్నది. అయినను నదియుఁ జూచెదఁగాక.

భీము—(కోపముగ) ఓరీ! దుష్టమర్కటమా! లంకాపురీనివాసులగు వీరభటులసారము బాగుగ గుర్తెఱింగిన బాహుబలముగల యా మహావీరుఁడు సర్వజ్ఞుఁడు. అట్టి మహావీరస్తవమునందు వినినదంత యు వ్యతిరేకముగ భాషించుచున్నాఁడవు. ఇట్టి విపరీతసంభావణాసే యునీవు మహాపాపివి. ఇట్టి నిన్ను సునసీయఁదగదు. కావున నీ వాల ముంబట్టి గిర గిరఁద్రిప్పి నేలంగొట్టి నిను మట్టుపెట్టెదను చూడుము. (అని వాలము నెత్తఁబోవును. కదలకుండును)

(తనలో) ఏమి యాశ్చర్యము! నాబలంబంతయు నీవాలము నెత్తఁ జాలకుండెనే! చూడ నీతఁడొక మాయావివలె నున్నాఁడు. (లేచి ప్రకాశముగా) ఓరీ! నీవు నను వంచింపవచ్చిన మాయారక్కసుఁడ వని యిప్పుడు తెలిసికొంటిని. బకాసురునియింటికి నిన్నతిథిగ నిప్పు డే పంపెదను చూడుము. అదిగో ఆసాలముంబెఱికి తెచ్చి దానిచే నిను మోది చంపెదను. (అని తెరలోని కఱుగును)

హను—(తనలో) నాపరీక్షించుట చాలును. ఇంక వీనింబ్రసన్నునిఁజేసెద గాక. నిజస్వరూపము దాల్చెదను (అని తెరలోనికరిగి నిజరూప మునవచ్చి కూర్చుండియుండును)

భీము—( తెరలోనుండి) ఓరీ నిశాటా!

గీ॥ మాయవేషంబుదాలిచి ♦ మహితయశుని
సచ్చరిత్రంబు మృషయంచు ♦ ముచ్చటించు
నిన్ను నీవటభూజాన ♦ సిహతుఁజేతు
హనుమపదపద్మములయాన ♦ గనుమి యిపుడె॥

(అని యొక చెట్టుతోవచ్చి నిజరూపముననున్న హనుమంతునిఁ జూచి) ఇదియేమి? హనుమంతునవలెఁ గన్పట్టుచున్నాఁడు! నిజమూ లేక యిదియు నీరక్కసిమాయయా! (వినుటః నభినయించి) ఆహా! అశరీరవాణి యేమనుచున్నది! నిజముగ నంబనీతనయుండా! (వృ క్షము పారవైచి) అయ్యో! యెంతపనిచేసితిని! (సమీపించి)అన్నా..

హనుమన్నా! క్షమియింపుఁడు. నాజన్మంబు ధన్యతనొందె. (పాదాక్రాంతుఁడై)

ద్విపద

జయ దయాపాథోధి ♦ జయ పుణ్యమూర్తి!
జయ దశదిగ్వ్యాప్త! ♦ సాంద్రసత్కీర్తి!
జయ దీనపోషణ! ♦ జయసత్కృపాంగ!
జయ జయ శ్రీరామ ♦ చరణాబ్జభృంగ!
జయ జితదైతేయ! ♦ సన్మునిగేయ!
జయ భక్తఫలదాయి! ♦ జయ యాంజనేయ!

క॥ అపరాధిని దురితాత్ముఁడఁ
గపటమతిన్ జడుఁడఁ గన్న ♦ గానక మీ కే
నపచార మొనర్చితి నన్
గృపతో మన్నింపఁగదవె ♦ కేసరితనయా॥

హను—(గ్రుచ్చియెత్తి) తమ్ముఁడా! నీశక్తిసామర్థ్యంబు తెలియంగఁగోరి యిట్లొనర్చితిని. నాయందు నీకుఁగల యవ్యాజప్రేమము దెలిసికొంటిని. సంతసమయ్యె. నీకిష్టమేని గోరు మిచ్చెదను. దుష్టులగు దుర్యోధనాదులతోఁ బోరుకల్గినయెడ నీపక్షమున నిల్చి నీకు జయంబు చేకూరఁజేసెదఁ, గావలయునా?

భీము—మహాత్మా! తమయంత మహాశక్తిమంతులము కాకున్నను దుర్యోధనాదుల నిర్జించుటకుఁ దమవంటివారికి శ్రమనియ్యనక్కరలేదు. అయినను నట్టిది సంభవించినఁ దామాసమయమున మా విజయము నుకోరుచు నటనిల్చి సంగరప్రదర్శనమును గాంచఁగోరెదను.

హను—అట్లయిన నర్జునునిరథకేతనమున నిల్చియుండెదఁగాక.

భీము—మహాప్రసాదము. ధన్యులము!

హను—ఇంక నీకు సౌగంధికములున్న జాడలఁ దెలుపవలయునా?

భీము—మహాప్రసాదము! (అని చేతులుజోడించి నిల్చును)

హను—(ప్రైసఁజేయిసాచి) ఇక్కడికిఁ జక్కఁగ నుత్తరమునకుఁ బోవఁ బోవ రజతాచలంబొండు గన్పడియెడి. ఆప్రైఁ గొంత దవ్వరిగితివేని,

సీ॥ రజతకాంచన నవ ♦ రత్నసంకలితమా
సాలగోపురధామ ♦ జాలకములు
లాలితాగణ్య క ♦ ల్యాణ సంపదల కా
ధారంబగు నవని ♦ ధానములు
వలనొప్పు పుష్పక ♦ ప్రతిమానతఁ గ్రమించు
నానామణిస్యంద ♦ నప్రతతియు
శతధృతికైన నెం ♦ చఁగరాని ఘనబలో
న్నతులగు యక్షాధి ♦ నాయకులును
గలిగి భూలలనామణి ♦ పొలుపు నిలుపఁ
బెట్టికొనినట్టి పాపట ♦ బొట్టొయనఁగ
నమరు నగభేది పుటభేద ♦ నమునకన్న
రమ్యతరమైన యలకాపు ♦ రంబొకండు॥

అప్పట్టణంబునకు శౌర్యాటోపుండును దినరాజతేజోవిరాజితుండును, నరిభయంకరుండును, గఱకంఠుపరమమిత్రుండును నగు కుబేరుం డధిపతి. అతండు విహారార్థము బహువిధఫలవృక్షతరులతావితానంబుచే నతిరమణీయంబగు నొక యుద్యానవనంబు నిర్మింపఁజేసె. అద్దాని మధ్యంబునఁ గాసారంబొండుకలదు. అందీ కనకకుసుమంబులుకలవు. ఆ కొలనికి నలుగడల మహాబలోపేతులగు యక్షదానవగంధర్వకిన్నరులు క్రమముగఁ దమతమ బలంబులతోడ జాగరూకులై కావలియుందురు. వారల సమరంబున సాధించి కమలంబులఁదెచ్చుట కష్టసాధ్యము. కావున దేశకాల పాత్రమ్ములెఱింగి ప్రవర్తించి సఫలీకృతమనోరథుండవగుము.

భీము—చిత్తము. (అని నమస్కరించును.)

హను—విజయోస్తు! విజయోస్తు!

(ఇరువురు నిష్క్రమింతురు.)

ఇది తృతీయాంకము



శ్రీ

హయగ్రీవాయ నమః

# భీమప్రతిజ్ఞ

---

## చతుర్థాంకము

(ధర్మజ, నకుల, సహదేవుల ప్రవేశము.)

ధర్మ—తమ్ముఁడా, నకులా!

గీ॥ వనవిహారంబు సేయంగ ♦ జనినయట్టి
ద్రౌపదియు భీమసేనుండు ♦ దడసి రింకఁ
జేరరారైరి ద్విజరాజి ♦ చేరెగూండ్ల
కింక మసలుటకేమొ యూ♦హింపనైతి॥

అదేమొకాని వామభుజంబు వేమా రదరుచునుండె. ఏమీ! యీయపశకునంబులు? అయ్యో! యెంతవలదని వారించినను నావంతయు వినక తాఁబట్టిన కుందేటికి మూడేకాళ్ళని పట్టుబట్టి చని నట్టడవుల నేగుట్టులపాలైరో గదా? అయ్యో!

నకు—అన్నయ్యా! ఏల మీ రిట్లు చింతిల్లెదరు? వనమునం దందందుఁ గల చోద్యముల నేత్రానందంబుగఁ గన్గొనుచు వారిరువురుఁ గడు దవ్వరిగి తిరిగివచ్చుట కొక్కింత యాలస్యంబయి యుండనోపు. అంతియెకాని మఱొండు కారణంబుండదు. దినకరుండు చరమదిశ కరుగుచుండెఁ గాన నింక వారిప్పుడకే మఱలివచ్చుచుందురు,

అయిననుజూచివచ్చెద. (కొంతదూరమున కేగి నలుదిక్కులఁజూచి ఆతురతతోఁ దిరిగివచ్చి) అన్నయ్యా! విచారింపకుఁడు. అల్లదిగో, అనతిదూరంబున నొక యరదంబుపై నిద్ద రియ్యెడ కేతెంచు చున్నట్టులఁ గన్పట్టుచున్నది. వారలు మన ద్రుపదరాజనందనియు, ననిలాత్మజుండు నని తోఁచెడిని.

ధర్మ—అట్టులనా? వారలింకెంతదవ్వున నుండిరో!

నకు—(చూచి) అదిగో యిటువచ్చుచున్నారు—భీమసేనాత్మజుండును, మనద్రౌపదియు.

(విన్నఁబోయిన మోముతో ద్రౌపదియుఁ బుష్పముతో ఘటోత్కచుఁడును బ్రవేశింతురు)

ఘటో—జనకా! నమస్కరించుచున్నాఁడ.

ధర్మ—ఆయుష్మాన్భవ! కుమారా! నీతండ్రి యెక్కడ?

ఘటో—తండ్రీ! ఈ కనకాబ్జమును గన్గొనుఁడు.

ధర్మ—(అందుకొని, చూచి, ఆఘ్రాణించి) ఆహా!

గీ॥ అబ్జలావణ్యమును గొని • యాడ వశమె
పూవునెత్తావి నింతని • పొగడఁదరమె
భర్మనిర్మితమై సౌర • భంబుఁ గనుట
దీని కెనయగుదాని జ • గానఁ గాన॥

సరియె కాని, నాయనా! మీనాయన యెక్కడ? (ద్రౌపదిం జూచి) అదియేమి? ఏలొకో యీపాంచాలనృపాలునిబాల బాలచంద్రునింబోలు నిటలాలకంబు వ్రేల్లవైచి తెలతెలఁబోవుచు మది కలంగిన తెఱంగునఁ గన్పట్టుచున్నయది. ఏమియుఁ గీడుమూడదు గదా? పాపంబు శమించుఁగాక! (ద్రౌపదినుద్దేశించి) పాంచాల రాజనందని! భీమసేనుండేడ?

చ॥ వలదని పెక్కుభంగులను • బల్కిన నీచెవికెక్కనీక పో
వలసినదేయటంచుఁ జల • పట్టి గదాయుధుఁగూడి కాననం

బులఁ దిరుగాడఁబోయితివి పో; పవనాత్మజు నెందుఁ బంచితో
తెలుపుము మీ రెల్లఁ జను దెంచియు నాతఁడు రాక యుంటకున్॥

ద్రౌప—(తలవంచి కన్నీరద్దికొనుచు గద్గదస్వరమున) అనఘా

శా॥ భూనాథా, భవదాజ్ఞఁ గైకొని వనంబుం జొచ్చి మీసోదరుం
డేనుం బోవుచునుండ మార్గమున మే మీపుష్పరాజంబు నే
త్రానందంబుగఁ గంటి మట్టి నవహేమాబ్జంబులం దెమ్మనం
గా నాకోరిక దీర్పనంచుఁ జనియెన్ గాంతారమధ్యస్థలిన్॥

తానేగుచు నన్నుఁ దమ సన్నిధి కరుగుమని పనిచె.

ధర్మ—అహో! యెంత మోసము పొసఁగె! కుమారా! హిడింబభాగినేయా!

ఉ॥ దానవనాథ! రాయనుఁగుఁదమ్ముఁడు భీముఁడు తోడువీడి తాఁ
గానకు నేగె హేమసుమకాండముఁ గొనితేర; నయ్యెడన్
దానవనిర్దయాత్మకురనాథులఁ గ్రిమ్మరఁబోలు నక్కటా
తా నెటు వారలం గడచి తమ్ముఁడు దెచ్చునొ తోఁచకుండెడిన్॥

అచట నేమోసము పొసఁగెనో. లేకున్న దానేల రానాలసించు? ఎవ్వరు సాయపడియుందురు? కటకటా! యెంత బహుళంబుగ గట్టెనో? (ఘటోత్కచుని నుద్దేశించి) అయ్యో, తండ్రి! నీ వీక్షణం బచటికిఁ జని మీతండ్రి సేమం బారసి యామేలువార్తఁ దెచ్చి నా వీనులకు విందొనర్పకుంటివేని నామదిఁగల దిగులు తీరనేరదు. సత్వరంబుగఁ బొమ్ము నాయనా!

ఘటో—జనకా!

ఉ॥ పావనమూర్తీ! రామహిత బంధురకీర్తి! భవత్పదాబ్జసం
సేవనొనర్చువారు గొలుచు సేవకుఁ డేఁటనుండ, నిందిరా
దేవికి భర్తయైన వసుదేవకుమారకుఁ డాప్తబంధుఁడై
కావఁగఁ దా నటుండ భయకారణ మున్నదె గల్గనేర్చునే?

యుష్మద్దయావీక్షణంబులే భవత్సహోదరులకు వజ్రకవచంబులై చెలంగు. వారలు తమ సన్నిధి నున్నంతవరకు కాశికిం

కుండైనఁ జెనకఁగల్గునా? అయినను తండ్రీ! మీమనమునం దనుమానము కలదేని యట్లే వాయునందనుఁ గలయ వనమునకుం జని,

శా॥ ముల్లోకంబులు నెత్తివచ్చినను ని ♦ ర్మూలించి మాయయ్యకు
త్యుల్లాసంబొనఁగూర్చి, కంజముల సొం ♦ పొప్పారఁగాఁ దెచ్చి, మా
తల్లిం జేయు దభీష్టసిద్ధివడయున్, ♦ దండ్రీ మరుత్పుత్రు మీ
కెల్లం జూపి, ముదంబుఁ గూర్తు నిదిగో ♦ నేనిప్పు డిప్పట్టునన్॥

ధర్మ—కుమారా! నీశక్తికి సంతసించితిని. (ఒకదిక్కు చూచి) అల్లదిగో, నారదమౌనీంద్రుం డిటకు వచ్చుచున్నవాఁడు. ఆత్రిలోకసంచారిచే మన భీమసేనునిజాడఁ దెలిసికొని యావలఁ బోవు టుచితము కావున యొక్కింత యాలసింపుము.

(నారదుఁడు పాడుచుఁ బ్రవేశించును)

ధర్మ—(ఎదురేగి) మౌనికులావతంసా! నమస్కారము.

నార—జయోస్తు! జయోస్తు!

ధర్మ—భవద్దర్శనసుకృతంబుచే మదీయజన్మసాఫల్యంబయ్యె. అయ్యుచితాసనము నలంకరింపుఁడు.

నార—(కూర్చుండి) ధర్మనందనా! ఏల నీవిట్లున్నాఁడవు? విశేషము లేమి?

ధర్మ—స్వామీ! ముల్లోకంబులం దెల్లయెడలఁ గలయందిరుగు భవాదృశమునితల్లజులకుఁ దెల్లంబుగాని విశేషంబులున్నవనుట కల్ల. అట్టియెడ నెఱుఁగనట్లు నన్నడిగెద రేల? అయినను నావలన వినఁగోరుదు రేని విశదీకరించెద నవధరింపుఁడు. నాతమ్ముండగు భీమసేనుండు సౌగంధికకుసుమంబులకేగి యింకను రాఁడయ్యె. అదియే విషాదకారణంబు. త్రిలోకసంచారులగు తామిప్పుడు "భీమసేనుం డెందుండె, సేమంబుగనుండెనా?"—యీమేలువార్తలు నాకెఱింగించి నన్ను సంతుష్టాంతరంగుం జేయ వేఁడెద.

నార—ధర్మనందనా! చింతిల్లకుము. తెల్పెదను వినుము.

మ॥ అవనీనాథ! భవత్సహోదరుఁడు తాఁ నబ్జాక్షి కిష్టంబుగా
ర్ప వనంబందుఁ జరింపుచుండ నొకచో వాతాత్మజుం గాంచి పో
వు విధంబాతనిచే నెఱింగి చని యంభోజాకరంబుం గనెన్
రవి యస్త్రాద్రికిఁ జేరునంత కట నో రాజన్యచూడామణీ॥

చూచి, యాకమలాకరంబునం గల సుమకాండంబులం గని సంతసిల్లి వానిఁ గొనిపోవుదునని యాప్రాంతఁ గాపున్న యక్ష, రాక్షస, గంధర్వ, కిన్నరబలంబుల కధ్యక్షులగు వారల నడుగ వారు తమ యేలికయగు కుబేరుని యనుమతివడసి తీసికొనిపొమ్మని నుడివిరి. అందుల కాతండు: "ఓయీ! యీసరోవరము పర్వతరాజ మధ్యంబునం గల సెలయేరులచే నేర్పడియె. కాన నిది యెల్లర సొత్తుగాని యొక్కనిసొత్తుగాదు. కుబేరుని సొత్తగుట కాతఁడు క్రయమునకుఁ బడసెనా, లేక మొదట తానే దాని నిర్మించెనా? నేను శ్రేష్ఠమైన క్షత్రియవంశజుండనగుట నితరుల యాచింపనొల్ల. క్షత్రియుండు తన భుజాబలమునఁ బరవిత్తములఁగొని యాచకుల కొసంగి కీర్తిచంద్రికల దిక్కుత్తులఁ బర్వఁజేయును. కావున నేను మీకుబేరుని యాచింపక యీసరస్సునం బ్రవేశించి పుష్పములఁ గొనిపోఁగూడదా యేమి?" అనుచు వారల సరకుఁగొనక నాకాసారముం జొచ్చి సౌగంధికముల గోసికొనుచుండ వారలు కోపించి భీమునితోఁ గయ్యమొనర్పఁ గడంగిరి.

ధర్మ—ఆహా! ఏమి వీనిసాహసము! అటుతర్వాత?

నార—అటుతర్వాత నాబలంబులన్నియు ననిలనందనునిచేఁ బొలియింపఁబడుటయు, నవ్వార్తం జారశ్రేష్ఠులవలనఁ దెలిసికొని కుబేరుఁడు తన కుమారుండగు నలకూబరుని సైన్యసమేతముగ మీతమ్మునిపైకి రేపకడఁ బంపనున్నాఁడు. రణంబు దారుణంబుగ జరుగఁగలదు. కావున నీవు నలకూబరుండు మార్కొనకమున్న,

క॥ అనుజులతో విప్రులతో
దనుజప్రకరంబుతోడ ద్రౌపదితోడన్

జనుమీ, నరనాథ! యీనిల
తనయుని జేరంగ నింకఁ ♦ దడయక వేగన్ ॥

ఇదియే నాయభిప్రాయము. కర్తవ్యం బాలోచించుకొనుము. ఈమార్గంబునఁ జనుచు మీ రిచ్చటనుంటవిని మిముఁ జూచు కోరిక నిటవచ్చితి. సంతసమయ్యె. నేఁ బోయివచ్చెద.

ధర్మ—చిత్తము. (నమస్కరించును)
నార—జయీభవ! (నిష్క్రమించును.)

ధర్మ—కుమారా! వింటివా? ఇఁకఁ దృటికాలంబైన నిచ్చుండఁ జనదు. కావున మన మెల్లరము బోవుదము. నీవు నీదనుజబలంబులఁ గూర్చికొని సత్వరంబున విచ్చేయుము. నేనును బ్రయాణ సన్నద్ధుండనయ్యెద.
ఘటో—చిత్తము. అటులనే యొనర్చెద. (నిష్క్రమింతురు)

---

(బదరికావనమార్గము)

నార—(నడుచుచు) ఆహా! నేఁ జేయు నిత్యైకాదశీవ్రతసమాప్తి నేఁడుగదా యొనర్పఁగంటి. ఇఁక ద్వాదశీపారణంబునకు వలయుఁ బరికరంబులఁ జేకూర్చుకొనవలయును. ఇంతవఱకుఁ దండులంబుల సేకరింపఁ గల్గితి. ఇంక నవి పచనంబుసేయ దానిలోనికి శాకంబులును బచ్చళ్ళును నూరుబిండులును, నతిరసంబులును, హయ్యంగవీనంబును, బిచ్చిలదధియు నాయత్తపఱచుకొనఁ బ్రయత్నింపవలసియున్నది. ఆహా! నేఁడుగదా బ్రేవుమనునట్లు తృప్తిగఁ గుత్తుకబంట మెక్కనుంటి. ఇట్టిభోజనంబు తిరిగి యెన్నఁడు లభించునోగదా! ముందేమియాలోచన? (ఆలోచించినట్లభినయించి) ఇప్పుడ గజపురంబునకరిగి రారాజునకీవార్త దెలిపి, ధర్మనందనునకు సాయపడఁ జనుమని యిచ్చకములఁ బల్కివచ్చెద. ఆపైని దుర్యోధనుండే కర్తవ్యంబూహింపఁగలఁడు. దారినడుచుచుఁ దర్వాతసేయునది యోజించెదఁగాక.

(నిష్క్రమించును.)

---

— హస్తినాపుర రాజసభ —

[గురు, కృప, కర్ణ, అశ్వత్థామాదులతో దుర్యోధనుని కొలువు]

సేవ—(ప్రవేశించి) కౌరవరాజకంఠీరవా! హజారముకడ నారద మహాముని తమదర్శనముకొఱకై వేచియున్నవాఁడు.

దుర్యో—(తనలో) ఈతఁ డెచ్చటనుండియైనఁ గ్రొత్తవార్తలఁ గొన్నిటిదెల్పఁగలండు. (ప్రకా) సత్వరము లోనికిఁగొనిరమ్ము.

సేవ—చిత్తము. (నిష్క్రమించును.)

నార—(ప్రవేశించును.)

దుర్యో—(ఎదురేగి) మునికులతిలకా! నమస్కరించుచున్నాఁడ.

నార—మనోవాంఛాఫలసిద్ధిరస్తు!

దుర్యో—ఈ యున్నతాసన మలంకరింపుఁడు.

నార—(కూర్చుండి) రాజేంద్రా, నీ రాజ్యమునం దందఱు క్షేమమా?

దుర్యో—స్వామీ, భవత్కృపాకటాక్షవిశేషంబున నందఱము క్షేమముగ నున్నారము. త్రిలోకసంచారమూర్తీ! త్రిలోకంబుల యందును వింతవిశేషములఁ గలవేని విన్నవింపఁ బ్రార్థించువాఁడ.

నార—కురుకులసార్వభౌమా! అన్ని విశేషంబులకేమిగాని నీకు హితం బగువాని నొక్కదాని జెప్పెద వినుము.

దుర్యో—అది యెయ్యది?

నార—సీ॥ అలకాధిపతిసుతసి • కుసుమ భమునకును
గల్గినసుతుఁగని • కయ్యమొదవె

దుర్యో—కయ్యంబులవరుఁ గల • కారణం బెయ్యది
చెప్పఁగాఁ జెల్లుమీ • సంయమీంద్ర

నార—కనకాబ్జముల నిమ్మ • గనియున్న నెదుర్న
వైరంబువొసఁగ నో • పార్థివేంద్ర

దుర్యో—కనకాబ్జములనేల ♦ కావలెనంచు నా
పాండుతనూజుండు ♦ వారిఁగోరె

నార—గీ॥ వనవిహారంబుసేయుచు ♦ వాయుసుతుఁడుఁ
గృష్ణయును వనమున సంచ ♦ రింపుచుండ
నొక్క కనకాబ్జమునుగాంచి ♦ యువిద యట్టి
విరులఁదెమ్మంచుఁ గోరె నా ♦ భీమసేను॥

అందుల కాతం డవ్విరుల వారి నిమ్మంచు నడిగె.

దుర్యో—సరిసరి. అదియాకారణము! తరువాత?

నార—తరువాత నేమున్నయది. అవ్వార్తఁవిని కలఁకఁ జెందిన మనంబుఁ గలవాఁడై భూసురాళితోడను, పాంచాలితోడను బదరికావనంబుననుండి ధర్మనందనుఁ డిప్పుడె మరున్నందనుఁ గలయఁబోవుచున్నవాఁడు. పాప మా సమరభీకరుండగు నర్జునుం డమరావతీపురంబునకేగి యింకను రాఁడయ్యె. ఇంతకు

ఉ॥ అక్కట యక్షసైన్యనిచ ♦ యంబులు క్రూరత భీమసేను నే
యిక్కటులందఁజేయునో? మ ♦ హాధవ! యెంతటివీరుఁడైన దా
నెక్కనిపోరనేర్చునె యఁ ♦ నేక బదిమందికి నొక్కఁడైనచోఁ?
జిక్కదె సర్పమొండు చలి ♦ చీమ లనేకము గూడివచ్చినన్॥

కావున నో వీరాగ్రగణ్యా! నీవేగి భీమసేను విడిపించి కీర్తిచంద్రికల దిగంతములఁ బర్వఁజేయుము. సాటిలేని త్యాగనాథుండవు. నీసమ్ముఖమ్మున లెక్క కెక్కుడగు యోధవరు లనేకులున్నవారలు.

గీ॥ అన్నదమ్ములయం దెట్టి ♦ యలుకలున్నఁ
బరులు తనవారిపై నెత్తి ♦ వచ్చిరేని
నపుడు తనవారిఁ గాపాడ ♦ నర్హమందు్రి
కాన వారల రక్షింపఁ ♦ గడఁగుటొప్పు॥

ఉన్నది యున్నట్టులఁ జెప్పితి. ఆపైని నీయిష్టము. తల్లికి లేని దయ దాదికేల? నేఁ బోయివచ్చెద. (వెడలును)

సేనాసమేతులమై చని ధర్మజుని నకులసహదేవులను బొలియించి ద్రుపదరాజపట్టిని బట్టితేవలయు. మంచి తరుణము దొఱకినది.

కర్ణ—(క్రోధముతో) ఏమేమీ, కురురాజాగ్రణీ! స్థూలసూక్ష్మంబు లెఱుంగనట్లు బల్కుచుంటిరి. ఏల భీమార్జునుల నట్లు స్తుతింపు చుంటివి? ఛీ!

మ॥ కరముల్ విప్రులపల్లెలం దిరిగి భి ♦ క్షుంబెత్తి దైన్యంబున
న్పరదేశస్థులఁబోలెఁ దామొరులపం ♦ చల్ జేరి జీవించు నా
నరునిన్ భీమునిఁ బెద్దజేసెదరొకో ♦ నా మ్రోల, వారన్న సం
గరరంగంబున నాకులెక్కయె, వడిన్ ♦ ఖండింతు దర్పోన్నతిన్ ॥

నాయంతటిసాహసప్రతిభగలవాఁడు నీదండఁ గొలువుండ నయ్యర్థమార్థములంగాంచి మది దిగులందనగునా? ఆపాండవుల సాహసంబులు మీ రెఱుంగకుందురా?

ఉ॥ వారలె శౌర్యసంపదల ♦ వారిగఁగల్గినవారలైన, బెం
పారనెదిర్చినిల్వరొకొ ♦ యాయుధముల్ హరియింపనెంచుచోఁ,
శూరతఁజూపరారొ సభఁ ♦ జూడఁగ ద్రౌపదికోకలూడ్చుచోఁ,
బోరఁగలేరొ తమ్ముఁ బుర ♦ ముల్ వెడలింపఁగడంగుచున్నచోన్॥

కావున నో భూరమణా, సెలవయ్యెనేని నే నొక్కరుండ చని యా భీమార్జునులకుఁ ద్రిమూర్తులుతోడువచ్చినను వారలను నుగ్గునూచంబుగ మ్రగ్గఁజేయఁజాలుదు. ఇప్పుడు,

మ॥ కవలన్ ధర్మతనూజు సంగరమునన్ ♦ ఖండించి పాంచాలి నే
నవలీలన్ గొనితెచ్చి యర్పణముఁ జే ♦ యంజాలుదున్ మీకు...

దుర్యో—(కౌఁగలించుకొని) రాధేయా!

సీ| జవసత్వంబు లెఱుంగనే దివిజులన్ ♦ సాధింపఁగా నేర్తు, వి
భువి సామాన్యులఁ బాండుసూనులను ని ♦ ర్మూలింపలేకుందువే?

నీమనంబెఱుంగనట్లంటిఁగాని వీరాగ్రగణ్యా! భీతిచే ననుట గాదు. నీవంటి శౌర్యాటోపుం డీభూమండలంబున నుండునా? అట్టి నీవు

నాకడనుండ నాకేటి వెఱపు? అకారణంబుగ నీమది నొప్పించినందు లకు నన్ను మన్నింపఁగోరెద.

కర్ణ—(ఉప్పొంగుచు) రాజమార్తాండా! మీయట్టివాని నేనా మన్నిం చుట? పాండవులంబొగడుటలు మీవలన వినుటచే జనించిన కోపా నలజ్వాలలకుఁ దాళఁజాలక నే నట్లంటింగాని మరొక్కటికాదు. మనమింక నిముసంబైన మసలక పాండవవనదహనంబునకుఁబోదము రండు. (నిష్క్రమింతురు)

---

బదరికావన ప్రదేశము.

(ప్రవేశము:—దుర్యోధన, భీష్మ, ద్రోణ, కృప, శ్వత్థామ, కర్ణులు).

దుర్యో—(వెదకుచు నాతురతతో) అంగరాజా! పాండవులెక్కడ? ఇదియెగదా నారదమహామునీంద్రుండు తెల్పిన స్థలము? ముందేగి యుండిరాయేమి? (దూరమునఁ జూచి)

చ॥ అదెయదె పోవుచుండి రిపు ♦ డల్లదె కంటిరె పాండుసూనులన్
వదలక వెంటనంటి యము ♦ నందనునీల్గఁగఁ జేసి తమ్ములన్
జదియఁగఁ గొట్టి, తెమ్ము జల ♦ జాయతనేత్రి, సువర్ణగాత్రి, ష
ట్పదకులవేణి, నాజలజ ♦ పాణినిఁ, బాండుతనూజురాణినిన్॥

భీష్మ—(కోపముతో) దుర్యోధన! ఏమీ? ఇంతటి దుర్మార్గమా? ఇట్టి దుష్టచేష్టలు నిన్నుఁగట్టి కుడుపవా?

మ॥ ఘోరతరంబగు పాపచయంబులఁ ♦ గొంకక చేసిన నూరకె పో
నేరున, ధారుణినొందవె నీవిటు ♦ నెయ్యముఁ జూపఁగవచ్చియు ముం
దారయ కే కుటిలంబుఁదలంచుట ♦ న్యాయమె భూవర! శత్రుఁడవై
పోరఁగరాదె హుటాహుటినిల్చిన ♦ యుజ్జ్వలకీర్తులెసంగ ననిన్.

ఓ! ఈదేవజగంబుల నీ చెడుబుద్ధులఁదలంచినమాత్రి, నేమా నిన్నకైన హాని వాటిల్లకుండునా? ఔరా, ఏమీ నీ దురహంకారము! నన్ను నీవెఱుంగవైతివి!

చ॥ "అరయఁగఁ బాండుసూను లరు ◆ దైన పరాక్రమవంతు లెంతయున్
హరికృప వారిపట్లఁ గల, ◆ దా రణవీరులఁ గెల్వ నేరికిన్
దరమగు, వీరిలోన నిది ◆ తప్పని చెప్పఁగలాఁడు లేఁడు" యం
దురు జనులెల్ల; మమ్మటుల ◆ దూరులఁ జేయఁ దలంపఁబోకుమీ!

మా యపకీర్తిఁ బాయఁజేయుటకయిన మానుషులఁజెవినిడి, యవ్వ్యూహమున నడిచిన బాగుపడఁగలవు. కాదేని నీ దుష్టచతుష్టయముతోడ నీ చతురంగబలంబులు గలనిఁ బొలియఁగలవు. (అని యొకపుల్ల విరిచి వైచును.)

కర్ణుఁడు—(కోపముతో) శంతనతనూభవా! శత్రుపక్షపాతీ!

చ॥ వెఱపొకయింతలేకిటుల ◆ వింగలిపల్కులఁ బల్కెదేనె? యం
దఱికిని దాతనంచు మదిఁ ◆ దట్టిన గర్వముతోడ నీవిముం
దఱ మము సడ్డసేయుకన ◆ ధర్మమె? పో, హితశత్రులంచు మి
మ్మెఱుఁగమె, పాండవేయులన ◆ నెక్కుడుగాఁ బడిచత్తురెప్పుడున్.

కాకున్న,

ఉ॥ పాండవులన్న నెంత? యమ ◆ పాంసనుఁడుండిన నెంతమాత్రము? భూ
మండలిలోన మమ్మెదిరి ◆ మార్కొనఁజాలిన వీరుఁడున్నె? ఛీ!
భండనమందు నిల్చినను ◆ పాండుసుతుల్ పసు పాల్పఁజూతు, వే
దండపురాధినాథు దరిఁ ◆ దత్తరమందుచుఁ బల్కనయ్యెనే?

ఆచార్యా! సంగరరంగంబుననిల్చి రిపుసంఘంబుల నిర్జించుటయో లేక వారి బారిఁబడుటయో శూరునిదారి. అటుగాక,

ఉ॥ కేలను బాణముల్ దొడిగి ◆ క్రిందుదనంబున నిల్చియుండఁగా
నేల? విరోధిసైన్యముల ◆ నెక్కుడుగాఁ దలపోసి కుందఁగా
నేల? శరంబులన్విడిచి ◆ యిప్పుడె చావఁగరాదె? యొప్పమిన్
బోలును గాజులందొడిగి ◆ మూలవసింపఁగ స్త్రీలపోలికన్ ॥

అశ్వ—ఒరే, వ్యర్థప్రలాపీ! ఏమేమీ? (దుర్యోధనునిఁజూచి) కురురా

జాగ్రిణి! ఆసూతపుత్త్రుఁ డెట్లాడుచున్నాఁడో చూడుము. ఆనీచుఁ డట్లు పేలుటకు,

చ॥ కల దొకతప్పు నీయెడను ♦ గౌరవవంశపయోధిచంద్రమా
ఖలుఁడగుసూతపుత్త్రునకు ♦ గాదిలిమిత్త్రుఁడవై మెలంగుచున్
దులువలనంబుచే నతఁడు ♦ తోఁచిన యోచనలెల్లఁ దెల్ప, గే
వల మవి వేదవాక్యములని ♦ భావమునం దలపోయుచుంటచేన్॥

ఇదియే నీపట్లఁగల నేరము. కాని,

ఉ॥ రంగగుమైత్రి నాతఁ డను ♦ రక్తిమెలంగుచు నచ్చఁబల్కు తా
సంగరరంగమందు నినుఁ ♦ జావఁగఁ జేసెదనంచు నాత్మ ను
ప్పొంగుచునున్నవాఁ డతని ♦ మోసమెఱుంగవు; పీనిఁగాంచుమీ
యంగిటియందు బెల్లమును ♦ నాత్మవిషంబుగలట్టివానిఁగన్॥

నిన్నిట్లుచేయుదునంచుఁ గంకణము గట్టియున్నవాఁడు. అదియు నంగాక,

చ॥ కదననిబంటువోలె, ఘన ♦ కార్ముకమున్ వడిఁ గేలఁ బూని తాఁ
గదనమునందునిల్చి నినుఁ ♦ గయ్యమునన్ గదియించి, మించి రా
మొదల[illegible] పారిపోవఁగల ♦ మేటిసుమీ మనసూతపుత్త్రుఁ డో
సదమలగాత్రి! [illegible] ఖలుని ♦ సాహస మెన్నఁ డెఱుంగకుందుమే॥

మఱియు, నీదుష్టుండు భవత్సామ్రాజ్యమునకుఁ దోఁచినధూమకేతువు[illegible]నున్నవాఁడు. కౌరవరాజేంద్రా! దుర్యోచనల మాని పాండుసూనులకు సాయము సేయంజనుఁడు. లేదేని యారాధేయునితోడ నీ బలంబులన్నియుఁ గలనిఁబోలియుఁగలవు. ఇది నిశ్చయము.

కర్ణుఁడు—ఓరీ! విదూషకా! వాక్యరా!

గీ॥ మాటిమాటికి బుద్ధి చెప్పెదవె ♦ బోయి, కంత
నాత్మజుండాడ చెక్కనే ♦ యుంగనైతి

నీవునట్టుల వదరిన ♦ నీదునాల్క
చీలికలొనర్తు చూడు నా ♦ సెలకరాసి॥

(అని కత్తిచూపి) మఱియు,

ఉ॥ నీవనెంత మాఁకు, ధర♦ణీపతి తావినుచుండ నోర నీ
ఛావము నీవెఱుంగక యె ♦ పల్కెదు; నాకరవాలధార నీ
జావఁగనేయకున్న నర♦జన్మమె నాదిఁక పేదబాఁపఁడ!

(అని పైకి దుముకును.)

అశ్వత్థా—ఓరీ సూతపుత్రా, కౌరవవంశనిర్మూలకారణా!

పోవకుమెందు, రమ్ము, నినుఁ ♦ బుచ్చెద నిప్డె కాలుఁ ప్రోలికి ॥

(అని మెదరోకొనును)

(కర్ణుని దుర్యోధనుండును, అశ్వత్థామను కృపాచార్యుఁడును పట్టుకొందురు)

దుర్యో—తగదు.

శశివదనావృత్తము:— వినుమిటు పుత్రా

| | | | |
|---|---|---|---|
| కృపా—వద్దు | ... | ... | చనదిటు పుత్రా |
| కర్ణ—తాళుము | ... | ... | వినఁ నికఁ దుమ్రింతుఁ |
| అశ్వ—వదలుము | ... | ... | దునిమెద పీనిన్ |

కృపా—అయ్యో, పలమీఁరిట్లు తగవులాడదగు. (ఒకదిక్కు జూపి)

అల్లదిగో,

ఉ॥ కొండకునుద్దియై తనరు ♦ ఘోరశరీరముఁ దాల్చినిల్చి, వే
దండపురాధినాథ! యదె♦దానవరాట్కులజుండు, గండభే
రుండపతాకముంగల మ♦రుత్తనయుండగు భీమసేనుపు
త్త్రుండు ఘటోత్కచుండనెడి♦దోర్బలశాలినిఁ గాంచుఁడల్లదుఁ.

చూడఁగా నాతం డిద్యోడకే వచ్చుచున్నట్టులున్నయది. వాని నెదుర్కొన హరిహరబ్రహ్మాదులకైనఁ దరమగునా? ఈ కర్ణుని సాహసం బెంతయో కలదు. కాని యొకదానిఁ దెల్పెద వినుము.

క॥ తనబలిమి, పరులబలిమియుఁ
గనుఁగొన కెవ్వాఁడు పోరఁ ♦ గడఁగునొ వాఁ డో
మనుజేంద్ర! యోటువడుఁగా
కని జయమెన్నండుఁ గాంచ ♦ నగునే ధరణిన్॥

పాండవుల కిప్పట్టున దండియగు రాక్షసమండలి యుండగా నుండె. మన మిప్పుడు వారితోడఁ బోరి జయంబు వడయుటకల్ల. అదియుఁగాక,

ఆ॥ వె॥ కినుకతోడ వారు ♦ జెనకిరా నిన్నెందు?
వారితోడ నీకు ♦ వైరమేల?
పార్థివేంద్ర, సైన్య ♦ వర్గంబుతోఁ బురిఁ
దిరిగి చేరనెంచి ♦ తేని వినుము॥

చ॥ పడుచుఁదనంపుబుద్ధులను ♦ బాయుఁగఁ జేయుచుఁ బాండవేయులన్
దడయక చేరుటొప్పదియు ♦ తప్పనితోఁచిన నెల్లరిట్టి కా
రడవులనుండ కింక వెస ♦ హస్తిపురంబును జేరు టొప్పగున్
జెడుగులు రాకయుండఁ బురి ♦ జేరఁగ నీమది నెంచియున్నచోన్॥

మఱియు, మన యీ మర్మంబులఁ గనెనేని యాదవుజేంద్రుండు మనల మనసీయఁడు. కావున వేగ వెడలుట మేలు.

కర్ణుడు—ఔరా! ఏమి మీ రణశూరత! చాలు! చాలు!

ఉ॥ కూరలు నూరుబిందులును ♦ గోరసమన్నము నూరుగాయలున్
బూరెలు పూర్ణంబులు న ♦ పూపము లప్పడములున్ చెలంగఁగాఁ
బారణ సేయఁగాఁదగిన ♦ విప్రులుగా కల భండనంబునన్
బోరొనరింపఁ జాలుదురె ♦ భూసురవర్యుల కేమెఱుంగమే?

మఱియు నో పిరికిబాఁపఁడా!

చ॥ అడుగో ఘటోత్కచుండనుచు ♦ నత్యధికంబగు భీతిఁ బల్కఁగా
జడియుదునొక్కొ, యుద్ధమునఁ♦ జక్కడఁగింపనె ధర్మనందనుల్
మడియఁగఁ జేయఁజాలనొకొ ♦మాద్రికుమారుల, భీమసూను, నీ
గడియను బాండవేయులనఁ♦గాఁ బడిచచ్చెడు మీర లౌనన్॥

అటులఁ జేయనైతినేని మీరెల్ల రవ్వాడే నగియెదరుగాక.

కృపా—రాధేయా!

చ॥ వెఱపొకయింతలేక యిటులఁ ♦ బ్రేలుచునుండఁగఁ జెల్లె ధారుణీ
శ్వరులకడఁ, బాండవేయులకుఁ ♦ జాలుదె? వారికి నీకుఁ బోల్పఁగాఁ
గరిమశకాంతరంబు, మఱి♦గాండివి కీడగువాఁడె లేడిటన్
గురుతుగ నీకు రాక్షసున♦కున్ దృణమేసుసమాన మిద్ధరన్॥

మఱియు, భీముని సాహసప్రతిభ కాబకహిడింబాదినక్తంచరులే సాక్షి. ఫల్గునుని బాహుపరాక్రమంబునకు ద్రుపదరాజసత్కృత మత్స్యయంత్రంబే సాక్షి. కావున మన మాఘనులఁ జెనకఁగలుగుదుమా? ఏల నీయోధవరులందెల్ల ధీరుండనని మీఁగినపనులకు దారిఁ జూపెదవు? కాదన్న వారలఁ గరువఁబోవుచు లజ్జాభయంబులుమాని నీవిట్టులఁబల్కుచుంటివి. నీ పలుకు లీభూతలపతి విశ్వసించుచుండెనని యిట్లాడుచుంటివి కాఁబోలు? మా మాటల నిసుమంతయైన వినవైతివి. ఆ ఘటోత్కచుండె నీకు బుద్ధిఁగఱపవలెఁగాక! మేము చెప్పిన వినియెదవా?

గీ॥ నేరనటువంటిపనులకు ♦ బారలిడుచు
బరుగువారినవాఁడు తా♦భంగపడఁడె?
యీఁతనేరనివాఁ డేఁట♦నీఁదులాడఁ
బోవ నిటను వడి మున్గి♦పోవకున్నె?

కాని బుడుతఁడు చెడుదారినడుచుటఁ జూచి, పెద్దవాఁడగువాఁడు దాని వద్దనుట ధర్మము. కావున,

—మత్తకోకిలలు—

నీతిమాలిటు పాండుసూనుల ♦ నీవెమర్పఁగఁబోవుటల్
భీతిఁజెందక పర్వతేంద్రము ♦ బిట్టు డీకొన నెంచుటల్
కర్ణుఁడు—చేతగాకిటు నీతులేటికిఁ ♦ జెప్పఁజూచెదు, నీచ! వే
నేతిముద్దలు మ్రింగుబాఁపలు ♦ నేర్తురే యని నిల్వఁగన్.
అశ్వ—ఓరిమూర్ఖుఁడ! కూడదంచును ♦ నొప్పఁబల్కి వారలన్
దూరనాడఁగఁబోయెదే, మదిఁ ♦ దోఁచదయ్యెనె నీకు ఛీ!
కర్ణు—ఏమీ, చండాలా! ఏమంటివి? మూర్ఖుఁడనా?
పారుఁబోత! వడిన్ నినున్ గర ♦ వాలముంగొని కూల్చెదన్.
అశ్వ—ఒరే, వ్యర్థప్రలాపా!
ధారుణింబడఁ ద్రొక్కనే నెదఁ ♦ దాకుమీ నను నీయెడన్.

(అని తన్నును)

కర్ణు—ఓరీ, నీచా! ఇదిగో కాచికొమ్ము. (కత్తిసారించును.)

అశ్వ—ఓరీ, చండాలా! సూతపుత్రా, ఇదిగో నావ్రేటు గాచికొమ్ము.

(అని కత్తుల నిర్వురు సారింతురు)

దుర్యో—ఆహా! ఇది తప్పి వచ్చినది. (విడఁదీయుచు) గురునందనా! అన్నియుఁ దెలిసిన నీవిటులొనర్చుట ధర్మమా?—రాధేయా! ఇదియేమి! ఏల నీవిట్లు పోరఁదొడఁగితివి? నే నొక్కటి వక్కాణించెద వినుము.

ఉ॥ క్షితిఁ జదిమంది కూడదను ♦ చెయ్దము సేయఁగఁగూడ దెన్నఁడున్
గుతుకము వీడి శాత్రవులఁ ♦ గూల్చిన పిదప నెబానటందుర్; లే
కితరమైనచో, "నటుల ♦ నేయఁగుఁగా కపు డేము తెల్పినన్
మతిని దలంపనందు కిది ♦ మంచిఫలం" బని గేలిసల్పరే?

ఈ మహాత్ముల మాటలెన్నియోగలవు. కావున నో రాధేయా నాపలుకుల కింతమాత్రమును దొలఁగినదువకుము. (రణమునకు దొరకొనుమని కనుసన్నఁ జేయును.) అందఱము బోవుదము రండు.

(అందఱు నిష్క్రమింతురు) (తెఱపడును)

ఇది చతుర్థాంకము

---



# భీమప్రతిజ్ఞ

## పంచమాంకము

---

బదరికావన ప్రదేశము.

[ధర్మజ, నకుల, సహదేవ, ఘటోత్కచ, ద్రౌపదుల ప్రవేశము.]

ధర్మ—(భేరీనాదంబు నాలకించి) కుమారా! ఘటోత్కచ! ఆధ్వని యేమై యుండును? ఎందుండి వినవచ్చుచున్నది? కారణ మేమియో గన్గొని రమ్ము.

ఘటో—(దిక్కులు పరికించి) తండ్రీ! అది రణభేరీనాదము. చూడ నిది మీర లొంటరిగనుంటఁ దెలిసికొని,

చ॥ తెఱవిదియంచు నెంచి పగ♦దీరఁగఁ బోరొనరింప నిప్డు డా
కురుపతిసేనలెల్ల నిట♦కుం బరతెంచెను సప్తసింధుల
బరువడి నేకమై పొరలి ♦ వచ్చెడు మాడ్కిని...

ధర్మ— ...హా కుమార! యే
దరిగల దింక? నామనము ♦ తత్తర మందుచునుండె నక్కటా!

హా! తమ్ముడా! భీమసేన! వల దనిపలు తెఱంగులఁ బల్కినను స రకుసేయక సరసిజాక్షితోడ నడవులకు వెడలుటచే మనపుట్టియుదు మల గుడువనయ్యె—అయ్యో! అర్జునా! నీవిందున్న యెడ మాకిట్టి

యిక్కట్టులు ప్రాప్తించవుగదా!—కుమారా! ఎంతటి కార్యమొదవె!

చ॥ ధనదుని చేతఁ జిక్కె నట ♦ తమ్ముఁడు భీముఁడు సంగరంబునన్
నున మిటఁజిక్కినారము కు♦మారక! కౌరవనాథు చేతిలో
నని నెదిరించి నిల్వఁగల♦మా? తెలవెయ్యదియో? మహేంద్రనం
దనుఁ డిపు డుండినన్ మనల ♦ దప్పక రక్షణసేయు నేకదా॥

కాని మనకు మనమే కాచుకొందమన్న మనలోఁ జూచిన,

క॥ చెక్కిటఁ గొట్టిన క్షీరముఁ
గ్రక్కుచునున్నట్టి నీవు ♦ కౌరవసేనన్
జక్కడఁగింపఁగ నేర్తువె?
అక్కట కవలైన నట్టి ♦ యర్భకులె సుమీ॥

భీష్మ, ద్రోణ, కృపాశ్వత్థామ, కర్ణాదులన సామాన్యులరా? వారలా సురలతోడనైనను దురమొనర్చి మెప్పొందినవారలు. మఱియు, ధార్తరాష్ట్రులును, సోమదత్తబాహ్లికులును జగద్విఖ్యాత బాహుబల పరాక్రమవంతులు. శకుని, భూరిశ్రవస్సైంధవాదులు లా మకరాంకవైరినైన మార్కొనఁ జాలుదురు. ఇట్టి బలియురతోడను, తక్కిన యోధావళితోడను మనమేరీతిఁ బోరొనరింపఁగలము? అయ్యో! ఇంకెయ్యది తెఱవు? దాయఁగట్టిన గొఱియలమైతిమి గదా.

ఘటో—(మేనువిరచుచు, మీసలు వడివేయుచు) తండ్రీ! తలచిన వీరు నీకు లెక్కయా! వీరలకై

శా॥ ఈమాడ్కిన్ దలపోయనేల? యాట యు♦ద్వృత్త ప్రతాపాఢ్యుఁడో
భీముం డిప్పుడె వచ్చు యుక్తతతులన్ ♦ బేరాజి నోడించి; నే
భూమిన్ గూల్చెద వీరెమర్కొను నెడన్;♦ బోఁదోఁ లెదన్ గానిచో
నేమీ, ఫల్గును డేల? చాలనొకొ, నే ♦ నీ ముప్పు దప్పింపఁగన్॥

మీరాపంతయు సందియుం బందకుఁడు. ఈకురుబలంబన నెంత?

వీరికిఁదోడుగ నీలేదులోకంబు లేకమైవచ్చినను నేగెల్వఁజాలనా?
తండ్రీ! మజ్జననిప్రతిన నేనెఱుంగుదుఁగాన,

క॥ పలుమాటలేల వినుఁడీ
కలని సుయోధనునిఁ జంపకయె నేవానిఁకా
బలిమిఁగట్టియుఁ ద్రుపద
జలజంబుల చెంత నిలుపఁజాలుదు నిపుడే।

అటుల నేఁజేయంజాలనైతినేని, నను భీమసూనుండని పిల్వకుఁడు.
ఇకనైన మీసందియంబుడిగి నన్నంపవేఁడెద.

ధర్మ—కుమారా! నీవట్లనుటచేఁ నొక్కింత ధైర్యంబూని నిన్నొంటిగఁ
బంపఁ దలంపుఁగలిగె. మంచిది. మేమెల్లరము ద్రుపదరాజాత్మజఁ
గాపాడుకొనుచు నీకు సహాయులమై వెనుకనుందెదము. కావున
నీవుచని విజయుండవుకమ్ము.

ఘటో—తండ్రీ! నమస్కరించుచున్నాఁడ.

ధర్మ—పుత్రా! విజయోస్తు! విజయోస్తు! లెమ్ము. సత్వరమ్మున సమ
రమ్మున విజయలక్ష్మిఁ జేకొమ్ము, పొమ్ము.

(యవనికపడును.)

---

(ఇరువురు గంధర్వులు ప్రవేశము)

మొదటివాఁడు—అన్నయ్యా! ఈమహారణ్యమధ్యంబున నిచట చిట,
పట పట ధ్వనులు మ్రోయుచున్నవే! ఎక్కడ? ఏకారణముచేత?

రెండవవాఁడు—తమ్ముఁడా! ఇప్పుడిమ్మెడఁ బాండవులపైకిఁ గౌరవ
సైన్యంబులు దాడివెడలిరాఁగా, భీమసేనాత్మజుండగు ఘటోత్కచుం
డు ధర్మరాజానుమతంబున వారలపైఁబడి ఘోరయుద్ధంబుఁ జేయఁ
బోవుచున్నవాఁడు.

**మొదటి—అట్లులనా! అటులైన మన మటకేగి యాయుద్ధమునఁజూంచి
వత్తమా?**

రెండ——చూడవచ్చునుగాని, మన మర్యాద నెక్కుడు జాగ్రత్తగనుండ వలయు. పోవుదము రమ్ము.

(ఇరువురు ముందుకునడిచి)

రెండ——తమ్ముడా! అల్లదిగో చూడుము! అదియే రణరంగము. ఆకన్న ట్టునదియే కౌరవసేన. ఈతండే ఘటోత్కచుండను రాక్షసవీరుండు. ఇప్పుడే యుద్ధ మారంభమైనట్లు లున్నయది. కావున మనమిచ్చోట భద్రముగ నుండవలయు.

మొదటి——అన్నయ్యా! అసంఖ్యాకులగు నాకౌరవభటుల నీరాక్షస వీరుం డొక్కరుఁడు సమరంబున సమయింపఁగలడా?

రెండ——తమ్ముఁడా! నీ వెంత వెఱ్ఱివాఁడవు? ఆతనిశక్తి నీ వెఱుఁగవు.

ఆ॥ వె॥ కురుబలంబు లెంత ♦ విరివిగా నుండిన
రాక్షసునకు సాటి ♦ రావుసుమ్ము
గులకరాలు గంప ♦ కొలఁదియుండిన, వన్ని
వాసి కొక్కరవకు ♦ తీసిపోవె?

కావున నీవట్టుల సందేహింపఁబనిలేదు. దానినిజం బిప్పుడే కని యెదవుగాక!

("కో" యని ధ్వనివినఁబడును)

రెండ——తమ్ముఁడా! చూచితివా?

ఉ॥ సింగము తీవ్రక్షుధార్తిమెయిఁ ♦ జెచ్చెరఁదాటుచు నేఁగియేఁగి సా
రంగచయంబుపైఁబడు క ♦ రంబు హుటాహుటి నప్పళించుభా
తిం గడు నుగ్రుఁడై చనుఁ బర ♦ తెంచెడు కౌరవసేనపైకిఁ బో
రంగ ఘటోత్కచుండనెడి ♦ రాక్షసవీరుఁడు, చూడు మాతఁడిన్॥

ఆహా! ఏమిరా! ఆఘటోత్కచుండు కౌరవసైన్యంబుల నెదు ర్కొని వాసికెక్కెనుఁ దాళఁజాలక యేలీల యాసేనలెల్ల బరువిడుచున్నవో చూడుము.

("పోటుఁడు, పోటుఁడు" అని ధ్వని వినఁబడును)

కంటివా! ఆపారుబోతులు వెన్నిచ్చి పారుచున్నంత నా రక్కసుండు వారి వెంటనంటి "పోటుఁడు, పోటుఁ"డనుచు వారిపై నంప వృష్టిఁ గురియించుచున్నవాఁడు—అయ్యో! పాప మాసేనలెల్ల నెట్లు చెల్లాచెదరై పోవుచున్నవో చూడుము.

("కావుము, కావుము" అని ధ్వనివినఁబడును.)

వింటివా! ఆ రాత్రించరుని ధాటికి కౌరవ్యంబులకు నా సేనలెల్ల "కావుము, కావు"మని కర్ణుఁ డున్న యెడకుఁ బరువులిడుచున్నయవి. చూడుము—అన్నన్నా! ఆఘటోత్కచుండు కర్ణునిఁగూడఁ దాఁకుటకై వాఁ డున్నయెడ కరుగుచున్నవాఁడు. కావున మనమును నచ్చోటికేఁగి, యాపర్యవసానము గనుఁగొనియెదము రమ్ము.

(నిష్క్రమణము) (ఇది విష్కంభము)

---

(కర్ణ ఘటోత్కచుల ప్రవేశము)

ఘటో—ఓరీ సూతపుత్రా! శూరశిఖామణులగు మాయయ్యలకును మీకును నెడ తెగని పగలు గలిగియుంటచే సమయము దొరకిన దని యొంటరిగనున్న ధర్మరాజాదులపైకి సేనానాయకుండవై వచ్చితివి కాఁబోలు. ఇట్టి కృత్రిమకార్యములకుం దగినఫలము నందెదవుగాక! నేనును తరుణంబు దొరకిన మీబలంబుల బరిమార్చి ధర్మనందను రాజ్యాధిపునిగఁ జేయింతునని యుఁ దలంచుచుంటి. అందులకు మంచితరుణము దొరికె. రమ్ము.

మ॥ సమరంబందు నిసుక వధించి శకునిన్ ♦ జక్కాడి దుశ్శాసనున్
జము మ్రోలన్ వడినిల్పి కౌరవపతిన్ ♦ మర్దించి సైన్యంబులన్
సమయంజేసి యజాతశత్రుని నికన్ ♦ ♦ క్ష్మాధిపుఁ గావింప నీ
మము నేఁబట్టితి రమ్మురమ్మిపుడు నీ ♦ మాహాత్మ్యంబు సూతాత్మజా!

కర్ణు—ఓరీ, వ్యర్థప్రలాపా! నా సాహసం బీవెఱుంగవైతివి.

ఉ॥ ఓరి నిశాట నీవిటుల ♦ నుబ్బుచుఁ బల్కఁగనేల? చూడు నా
శూరత; నింక మీరెటకుఁ ♦ జొచ్చిన నిస్వధియించి, ధర్మజుర్
ధారుణిఁగూల్చి యాకవల ♦ దర్ప మడంగగఁజేసి, ద్రౌపదిన్
ధీరతఁబట్టి మాకురుప♦తిన్ గడు సంతసమందఁ జేసెదన్॥

ఘటో—ఓరీ, దంభప్రలాపా! నీవంతటి సాహసివగుదువా? అట్లయిన యుద్ధరంగమునకుఁ బోవుదము రమ్ము. (ఇరువురు నిష్క్రమింతురు)

(పారిపోవు కర్ణుని తరుముకొని పరుగిడుచు ఘటోత్కచుఁడు ప్రవేశించును. కర్ణుఁడు పారిపోవును)

ఘటో—(తెరలోనుండి వచ్చును)

శా॥ ఓరీ! పోవకు సూతపుత్ర! నిలువిరా♦యొక్కింత; యాతండె నీ
రారాజౌ గద, పిల్వు మాతని, వడిన్ ♦ రక్షించు నిన్నిప్పు డో
ధీరమ్మన్య! సతంబు మంత్రముల బో♦ధింపంగఁజాల్ నిన్నుఁ దా
నీకీర్తిన్ విడనాడఁజూచునొకో? ధా♦త్రీశుం డదాక్షిణ్యుఁడై॥

(అని తరుముకొని తెరలోనికి పోవును.)

శకుని—(ప్రవేశించి) ఆహా! ఘటోత్కచుఁడు కర్ణుని నామావశిష్టునిఁ గావించి, మమ్ము బరిమార్చుటకుఁ గాఁబోలు నీదెసకే వచ్చుచున్నాఁడు. దైవమా! ఏమిసేయుదు? అయ్యో!

మ॥ కనుగొంటే కురుసైన్యసంహరణదీ♦క్షాత్ముండు, దైత్యేభ్యుఁ డో
జననాథాగ్రణి! సూతపుత్రకు వడిన్ ♦ జక్కాడి, తా భీకరా
ననుఁడై వచ్చు; నికేను నిల్వగలనా? ♦సన్నాచి యాసించునిన్ [illegible]
దునుమాడన్ జనుదేరవే కురుపతీ! ♦ దుర్వారశౌర్యోన్నతీ!

(ధ్వని వినఁబడును) అయ్యో! మిక్కిలి సమీపించుచున్నాఁడు. అతని ముందు నేనిల్వఁజాల. (అని పారిపోవుచుండ)

ఘటో—(పరువిడుచు బ్రవేశించుచు)

ఉ॥ ఏలతొలంగెదో శకుని! ◆ యిట్లొనరింపఁగ నీతియౌనె, భూ
పాలుఁడు మేనయల్లుఁడు, స◆భాస్థలి నీవొనరించినట్టి యా
మేలు దలంచియైన నిను ◆ మేఁకొని ప్రోవఁగరాఁడె? నిన్ననిఁ
దూలఁగఁజూచువాఁడె? ఘన◆దోర్బలుఁడే వడిఁ బిల్వ మాతనిఁ ॥

ఓరీ! దుష్టబుద్ధీ! నీశక్తిసామర్థ్యంబులఁ జూపుటకు,

సీ॥ వలనొప్ప ఘోరాహ◆వస్థలియౌగాని
ఛలములాడెడు ద్యూత ◆ శాలగాదు
ఖ్యాతికినెక్కు సం◆గరఖేలనముగాని
తాతయ్య! మాయజూ◆దంబుగాదు
పొలుపొంద ఘనశరం ◆ బులుగాని, నీవను
గతిఁ బడ నివి పాచి ◆ కలునుగావు
నలువొంద దానవ ◆ నాయకుల్ గాని మా
యలుబన్నఁగాఁ బొండ ◆ వులునుగారు

గీ॥ ఔర! యీరీతి వెన్నిచ్చి ◆ పార మేర
యౌనె, పోవకు పోవకు ◆ మయ్య యెందు
పరుగువారిన నిను భంగ ◆ పఱుప కింక
విడుతునని యెంచఁబోకు మె ◆ న్నఁడు దురాత్మ!

(తరుముకొనిపోయి, తిరిగి ప్రవేశించి దుర్యోధను నుద్దేశించి, కోపముతో) ఓరీ! సుయోధనా! దురాత్మా! కౌరవకులకలశబడబానలా! ఇంక నీవ చిక్కితివి. దూరమ్మున నిల్చెద వేల? రమ్ము. అల్లదిగో! చూడుము. మీవారల యవస్థలఁ గన్గొనుము.

క॥ వీరలె నీతమ్ములు, మఱి
వీరలె నీమామ శకుని ప్రియుఁడగు కర్ణుం
డారయ వీరెల్లరు జము
బారికిఁ జనను్నవారు ◆ పార్థివచంద్రా!

వీరు నీకుఁ బరమాప్తులు కారా? ఇప్పుడే నీపరాక్రమముఁజూపి వీరల విడిపించుకొని పోయెదవుగమ్ము—కదలవేమి?

గీ॥ అలిగి వీరల మర్దించు ♦ నపుడుగాక
సమయ మెయ్యది నీపరా ♦ క్రమముఁ జూప?
నిచటి కేతెంచి తెందుల ♦ కిప్పు డిట్టు
లలుక నుంతైనబూనక ♦ నిలుచు టేమి?

పాప మాదురాత్ములు కర్ణ శకునులిద్దరే! దుర్యోధనా! నీకింక దుర్యోచనలఁ గఱపువారెవ్వరు? ఇట్టిచెలికాండ్ర నెడబాసి యీవసుధ నెట్లేలెదవు? ఇంకెట్లు మనియెదవు?——

క॥ మును పాండవులను మాయల
ననుపొందఁగఁ గెలిచితనుచు ♦ ననయము విందుర్
జనవర! యిపుడటు సలుపన్
జనునే? శరమునను గెలిచి ♦ చనవలెసుమ్మీ॥

నీదుర్మార్గముల నే నెఱుంగనని తలంచితివి కాబోలు. ఆహా! అట్టినీకిప్పు డిట్టి శాంతగుణంబు నావలనం గలిగె. ఓర్రోరీ!

చ॥ ధరణిప! యుద్ధమందు ననుఁ ♦ దాఁకెదనంచు మదిన్ దలంచినన్
గరిపురిపైని నాసకిడి ♦ గ్రక్కున రమ్ము...

(తెరలోనికి పరుగునపోవుచు)...సుయోధనా! వడిన్

బరువిడ నేల? జూదమున ♦ బాండుతనూజులఁ గెల్చినట్టి ని
న్నరయఁగలాఁడ? ధాత్రి నొక ♦ డైన, బలాఢ్యుఁడ! పోకుపోకుమీ!

(తిరిగి ప్రవేశించి)

ఆహా! అయ్యది తరువా? దాని నాదుర్యోధనుండని భ్రమజెంది వచించుచుంటినే. ఐననేమి. ఇప్పుడే వానికై పోయెదఁగాక!

---

(ద్రోణ, దుర్యోధనుల ప్రవేశము)

ద్రోణుడు——(ఆలకించి తలయూచి) కౌరవరాజేంద్రా! ఆ రాత్రించర రుండాడెడు పరుషోక్తులు వినుచుంటివా? ఆతఁడొక తరువుంగని, నీవని భ్రమజెంది యట్లాడుచున్నవాఁడు. నిజముగ నిన్నే కన్గొన్న

నేమి సేయునోకదా? ఆహా! ఆతఁడుగూడ నియ్యెడకే పరువిడివచ్చు చున్నవాఁడు. ఇంకేల మన బిక్క పెగ్గెలు?

చ॥ మనుజపతీంద్ర! నీయనుఁగు ♦ మామయవస్థను జూచితీవు; నా
దనుజుని భీషణాస్త్రతతి ♦ ధాటియుఁగంటివి; వాని పరాక్రమ
జనునె ధరిత్రినెవ్వరికి? ♦ సాగఁగనేర్చునె సాహసంబులిం
కను మది బీరముల్ విడిచి ♦ కౌరవకోటికి రక్ష సేయుమా॥

అది యెట్లంటేని, నీవిప్పట్టున నా రక్కసునితోడఁ జెలిమింజేయుటయె. అదిగాక వేఱొక తెఱవు గన్పట్టదు. ఇది ముమ్మాటికి సత్యము. నీవిటు లొనర్పవేని, కరిపురిపై నాస నేటితో సరియని యెఱుంగుము. వీని సామాన్యనక్తంచరుండని తలంచితివి కాబోలు! ఈతం డాదశకంఠునంతటి మేటిసుమీ!

దుర్యో — (తలపంకించి, వంచి, తనలో) ఆహా! ఇంకెయ్యది తెఱవు? వీరిట్లు పుల్లవిరుపుమాట లాడుచున్నారే. ఇంక కర్తవ్యమేమి? పుత్ర, భ్రాతృ, సుహృ, ద్బాంధవులెల్లరు నీరాశ్రించరుచే ధాత్రిఁ గూలిరి. కావున, నిప్పట్టున వీరివచనానుసరణి నా యసురునితో నేస్తమొనర్చుటయే ప్రశస్తమని తోఁచెడిని. కాని వీని నెట్టులఁబల్కరింతు? కోపానలజ్వాలలఁ బర్వఁజేయుచు వచ్చుచున్నాఁడే! వీని నెవ్విధిఁ బ్రసన్నునింజేయఁజాలుదు? (ఆలోచించి) సరిసరి. ఇప్పుడొకయుక్తి తోఁచినది. అదిగో! రాక్షసుఁడు సమీపించుచున్నవాఁడు. ఎదురుగాఁ బోయెదగాక!

ఘటో — (ప్రవేశించుచు) దుర్యోధనా!

ఉ॥ మించినవేడ్కఁ బాండవుల ♦ మేదిని గూల్చెదనంచు నాత్మ నూ
హించి వనాంతరస్థలి క ♦ హీనపరాక్రమ మొప్ప వచ్చి, వే
కాంచితె కర్ణునిన్ శకునిఁ ♦ గాలునిపోల్చిలున కేగుచుండ, నో
వంచక! వారి వీడిచనఁ ♦ బాడియె, పోయెదు రమ్ము వారితోన్॥

ఓరీ! చిక్కితివా! నీవింకెందుబోయెదవు?

దుర్యో — (ఎదురుగా బిరబిర జని కౌఁగలించుకొని) కుమారా! భీమ

నందనా! నీకిది న్యాయమా? నా సోదరులగు పాండవులపాటు విని, సైన్యసమేతుండనై వారలకు సాయపడఁ జనుదెంచు నాపైనా నీ సాహసము? కురుపాండవుల కొకభేద మున్నదా? మేమెల్లర మొక్కటియేగదా! పగతునివలె నీవిట్లొనర్పఁదగునా? శాంతింపుము. నా వచనముల నాలకింపుము.

వనచరులేరైన నీవనమ్మున మమ్మడ్డగింతురేమోయను తలంపున స్వసంరక్షణార్థము మేము రణభేరి మ్రోయించితిమి. అయ్యది విని నీవు మమ్ముల శతృలఁగా నెంచి మాపై దాడి వెడలితివి. అంత నేను నిన్నుంగని "తెలియనికతంబున నీవిట్లు వచ్చుచున్నాఁడవని యెఱింగియు" నా సైన్యంబుల మరల్పనైతి. అందులకు కారణంబొండుకలదు. అది యెద్దియన, "మీర లేకతమ్మున మా బోంట్ల సహాయంబునైనం గోరక, ధనముని పైకి వెడలుచుంటఁగని, మీరలు వారల సమరమ్మున నెదిరింపఁగల్గుదురా, అంతటి శర కౌశలంబు గలదా" యని సందియంబొందవి, "కానిమ్ము చూతము. ఇంటఁగెల్చి రచ్చఁగెల్వమన్నటుల మనతోఁ బోరి నిల్వఁగల్గినఁగదా నాయక్కుల నెదిరింపఁజాలుట" యని యూహించి నేనట్లొనర్చితి. ఇప్పుడు నా సందియంబు దీరె.

గీ॥ ఔర, కంటిని కంటి, కుమార! నీదు
బాహుబలమెల్ల; నేత్రపర్వంబుఁగంటి
దివ్యశస్త్రాస్త్రమహిమంబుఁ దెలిసికొంటి
భీమనందన! సంగ్రామభీమ! నేఁడు॥

నిక్కముగ నీ వొక్కరుండవే యాయక్కులఁ బొలియింపఁజాలుదువు. కుమారా! శాంతింపుము. ఈకల్లోలంబంతయుఁ గల్లయని భావింపుము.

ఘటో—(ఆశ్చర్యముతో) దుర్యోధనా! ఇదియేమి! అందిన జుట్టును అందనిచోఁ గాళ్ళను బట్టువానివలె నున్నాఁడవే! అన్నా! నిన్ను నమ్మఁజాల. (అని దుర్యోధనుని రెక్కల విరిచికట్టును.)

దుర్యో—కుమారా! రాత్రించ రేంద్రి! అట్టి సందేహంబు లుడుగుము, నా వచనమ్ములు సత్యములని యెఱుంగుము. ఇంక మనమిట నేల యాలసింపవలయు! భీమసేనునికిం దోడుపడ వేగమ పోవుదముర మ్ము. మున్ముంద మాయన్నయగు యుధిష్ఠిరసముఖమ్మున కేఁగెదము గాక! (అని యిరువురు నిష్క్రమింతురు)

ద్రోణా—ఆహా! ఏమి వీనియుక్తి? ఇప్పుడుగదా సుయోధననామము సార్థకమయ్యె. కర్ణ శకునిప్రముఖుల సేవ దేర్చి వారినిఁగూడఁ దీసికొని పోయెదగాక! (నిష్క్రమించును)

---

(కర్ణాశ్వత్థామ ద్రోణాదుల ప్రవేశము)

ద్రోణా—మీర లిటురండు. (కర్ణాశ్వత్థాముల బిలుచును)

అశ్వ—రాధేయా! మజ్జనకుండు పాండవులతోఁ బోరొనర్ప దలంపవలదనియు, నటులఁ దలంచినఁ గీడుమూడుననియు, బలు తెఱంగులఁ జిలుకకుఁ జెప్పినటులఁ జెప్పినను నావంతయు సరకు సేయక,

"ఉ॥ పాండవులన్న నెంత? యదు ♦ సంసనుఁడుండిన నెంత నాకు? భూ
మండలిలోన నన్నెదిరి ♦ మార్కొనఁజాలిన వీరుఁడున్నె? నీ
భండనమందు నిల్చినను ♦ పాండుసుతుల్ పడు పాట్లుచూడు, వే
దండపురాధినాథుదరిఁ ♦ దత్తరమొందుచుఁ బల్కనయ్యెనే?"

అని ప్రగల్భములాడిన నీ విప్పు డిట్టుల తలపోసికొనియెద వేమి?—ముందు వెనుక లారయక,

ఉ॥ మాటలు పెక్కు నేర్చితని ♦ మమ్ముల నోట వదింపరానటుల్
మాటికిమాటికిన్ వదర ♦ మాన్యతిగల్గెనె; మద్వచన్ము లా
టోటని యెంచి తప్పుడు; ఘటోత్కచు సాహస మిప్పుడైన నీ
పాటిదటంచుఁ గాంచితివె? ♦ స్వానుభవంబున సూతపుత్రకా!

ఔరా! "తడిసిస్థాని గుడిసెగట్టుదు, తగ్గిగాని మొగ్గ"దను లోకోక్తి రిత్తదగునా? ఎవ్వండేని తన్ను మించి చరించువాఁడు పరిభవం.

బందకుండునా? పాపము! నీకెట్టి గర్వభంగము సంప్రాప్తించె. ఏల నీవీలీలఁ దలపోసికొనియెదవు? గతజలసేతుబంధనమేల? ఇఁకనైన బుద్ధిగలిగి నలువురతోపాటు నీవును నడువుము.

కర్ణు——(తనలో) ఆహా! వీఁడు నాశరీరము చిరుగులువడఁ కఱకుటమ్ములఁ బోలు పలుకులాడుచుండెనే? ఏమి నాబ్రదుకు?

(అందరు నిష్క్రమింతురు.)

---

(ధర్మజ, నకుల, సహదేవ, ద్రౌపదులును, ఘటోత్కచుండును, ద్రోణ, కర్ణ, శ్వత్థామ, కృపాచార్య, శకుని, దుర్యోధనాదులును ప్రవేశము.)

(శంఖధ్వని వినఁబడును)

నకు——(ద్రోణునితో) వింటిరా, ఆశంఖానినాదము. అల్లదిగో! దుర్వార శౌర్యగర్వితారిమదేభకంఠీరవుండును, భీమబలాఢ్యుండు నగు భీమసేనుండు.

గీ॥ వసుధ తల్లడమందంగఁ ♦ బాఁపఱేఁడు
కదల, దారలు డుల్ల, డి ♦ క్తటము లదర
నాదికూర్మంబు మది చెడి ♦ యదర నదిగొ.
శంఖనినదంబుసేయు ని ♦ శ్శంకనిపుడు॥

కావున నిపుడే కదనంబునకుఁ గడంగుచుండవలెను! సత్వరమున నరిగెదము గాక!

(అందరు ముందుకు నడతురు.)

ధర్మ——గురువర్యా! మన మిపుడు కదనరంగము సమీపించినారము. (ఒక దిక్కుఁజూపి) ఆచార్యా! అల్లదిగో! దూరంబున మన వైపునకు నాతురతతోఁ బఱతెంచు పురుషుం డెవ్వఁడై యుండనోపు?

ద్రోణా—ధర్మనందనా! ఆతండు భవత్సహోదరుండగు నర్జునుండు గన్పట్టుచున్నవాఁడు.

ధర్మ—(వికసితవదనుండై) నాకును నట్టులనే తోఁచెడిని.

అర్జు—(ప్రవేశించి) అన్నయ్యా! నమస్కరించుచున్నాఁడ.

ధర్మ—ఆయుష్మాన్భవ!

అర్జు—(ద్రోణునిఁగని) గురువర్యా! భవచ్ఛిష్యుఁడిదే మ్రొక్కుచున్నవాఁడు. (పాదములకు మ్రొక్కును.)

ద్రోణా—దిగ్విజయోస్తు! లెమ్ము. (లేవదీయును.)

ధర్మ—తమ్ముఁడా!

క॥ కవ్వడి! యియ్యెడ దురమని
యెవ్వనిచేఁ దెలిసికొంటి ♦ వింద్రుని సభలోన్;

అర్జు— ఎవ్వండగు? నారదుఁడే
సవ్వడి యెరిగించె నాకు ♦ సాకల్యముగన్॥

ధర్మ—ఆహా! నారదమహానీంద్రుఁడు కడు వందనీయుండు. సరియకాని యింకఁ గర్తవ్యమేమి? ఈదిక్కునంజని మనసోదరునిం గలిసికొందము రండు. (అందరు నిష్క్రమింతురు.)

---

(భీమ, నలకూబర, మణిభూషణుల ప్రవేశము.)

నల—ఓరీ, నరనాథాధమా!

ఉ॥ చోరునిభంగి మానసరసిఁ ♦ జొచ్చి, భయం బిసుమంత లేక, త
న్నీరజముల్ గ్రహింపఁదగు ♦ నే? దురితాత్మక! మోహహీన! సి
తీకునుఁగాంచి కూడదని ♦ తెల్పిన మానవపాలకావళిన్
గ్రూరతఁ ద్రుంచివైచితివి; ♦ కూళ! నిను మనసియ న్యాయమే?

భీమ—ఓరీ, తులువా!

గీ॥ తులువతనమున నీవాడు ♦ పలుకులకును
దగిన ప్రతిఫలమందెదో ♦ పొగరుబోతు!

యాసరసిఁజొచ్చి, పుష్పముల్ ♦ గోసికొనుట
చౌర్యమే? యట్లు దలపంగ ♦ సరియె నీకు?

నల — ఓరీ, బాలిశా!

గీ॥ మాసరసిఁజొచ్చి పుష్పముల్ ♦ గోసికొనుట
చౌర్యమే కాదె? నీ వెంత ♦ సాహసివో?
పరులసొత్తుల ననుమతి ♦ వడయ కెపుడు
గొనుట చౌర్యంబుగాదె యో ♦ క్రూరకర్మ!

భీము — ఏమేమీ? ఆకొలను నీయదియా? అందలి సరసీరుహంబులఁ గొనుట చౌర్యమా? చాలు! చాలు!

శా॥ ఈతీరెందువచింపఁబోకు మధమా! ♦ యీపర్వతవ్రాత సం
జాతంబై చను నిర్ఝరీజనిత కా ♦ సారంబు నీదంచు ని
ర్భీతింబల్కెదె దుష్టచిత్త! యదినీ ♦ విత్తంబునంగొంటె? నీ
తాతల్ దానిరచించినారె? యితరుల్ ♦ దాకంగరాకుంటకున్ ॥

ఆసరసిపై నీకెట్టి స్వాతంత్ర్యముకలదో యితరులమగు మాకును నట్టి స్వాతంత్ర్యమే కలదు. ప్రకృతినిర్మాణముల కందఱు సమానస్వతంత్రులే కదా? కావున నీవింక జంకుమాని దొంగతన మనఁగ డంగితివేని నీ కెక్కులింక దక్కవని యెఱుంగుము.

నల — చాలు చాలు —

మణి — ఆహా! ఈతఁడు గొప్పశాస్త్రజ్ఞుని తెఱంగునం గన్పట్టుచున్నాఁడు. దీనింబట్టిచూడ "నాకంటపడినదిగాన నది నాయది" యను నూతనధర్మంబాచరణలోనికిం దెచ్చు సచ్చరిత్రునిభంగి నున్నవాఁడు.

నల — మానవాధమా! మావనముంబ్రవేశించి, యందలిచిత్రంబుల నేత్రపర్వంబుగఁ గాంచి, వచ్చినత్రోవం బోవక, తన్మధ్యస్థకాసారంబుఁ జొచ్చి, కలంచి, యందలి కమలంబులఁ గొనుచుండ, నీకది తగదనియున్న, గొలంకె నాయది యనఁగడంగితివా! ఎంత మహోన్మత్తత నున్నాఁడవు? చాలుచాలు. తుచ్ఛుఁడా! ఇట్టిపిచ్చిప్రేలుడు లికఁ గట్టి

పెట్టియిచ్చోట్టుపడి, తక్షణంబ చనకుంటివేని, నీప్రాణంబులు నీకింకఁ దక్కవని యెఱుంగుము.

భీము——యక్షాధమా!

క॥ ముక్కిడి! యేమంటివి? నీ
జక్కులబలములను కలని ♦ జక్కాడిన నా
యుక్కు నెఱుంగవు; మఱి నీ
వెక్కుడు బల్లిదుండవౌక్కొ ♦ యెల్లరకంటెన్!

నల——ఓరీ దంభప్రలాపా!

ఉ॥ వేదురుంబట్టిన ట్టిటులం ♦ బ్రేలిన నాగదతోడ ని న్నిదే
మోది, ఖరార్కసూనుపుర ♦ మున్ వడిఁ జేర్చెద, దుర్మదాంధ!

భీము——యక్షాధమ! నీగదన్ దుత్రిటిని ♦ జక్కఁగఁ జేసి, నిన్ వధింపగాఁ
బోదమటంచు నాగద ప్ర ♦ మోదముఁ జెందెడు రమ్మురమ్మికన్॥

ఓరీపారుబోతా! పోరికిఁ దారసిలుము. నీకండకావర మడంచువాఁడరమ్ము!

నల——ఇదిగో! వచ్చితి. కాచికొమ్ము.

మణి——(నలకూబరున కడ్డమువచ్చి) మహారాజా! ఈసామాన్య నరాధమునితోఁ బోర నేఁ జాలనా? ఒక్కత్రుటికాలంబున నిర్జించివచ్చువాఁడ. చూడుము నా రణప్రావీణ్యము.

నల——మంచిది పొమ్ము.

మణి——ఓరీ! నరుడా! నన్నుంగెలిచి తరువాత మా మహారాజుపైకిఁ బొమ్ము. (తనలో) ఏమీ! ఈనరుఁడు సామాన్యునివలె గన్పట్టడయ్యె. ఇట్టి భీమబలాఢ్యునితోఁ బోరి నే జయమందఁగలనా? వట్టిమాట. ఒకవేళ నే జయమందితినిపో, నాకు సర్వసైన్యాధిపత్యపదవి తప్పక సిద్ధించును. అందునకు సందియంబులేదు. కాక, నేనోటువడినను మా మహారాజునకొకవిధమున సాయము జేసినవాఁడనే యగుదును. అదెట్లంటేని, నాతోఁ బోరుసల్పుటచే నీనరుం డలసటఁజెందక.

మానవుఁడు. అప్పుడీతని మామహారాజు గెల్చుట మిక్కిలి సులభము. (ప్రకాశముగా) నరుఁడా! సిద్ధముగా నుంటివా?

భీము—మంచిది రమ్ము. (ఇరువురును కత్తులతో యుద్ధమొనర్తురు)

నార—(ప్రవేశించి, దూరమున నిల్చి తనలో) ఆహా! నాకెట్టి విందులపై విందులు జరుగుచున్నవి? నిన్ననే ఘటోత్కచునకును గౌరవులకును జరిగిన ఘోరసంగ్రామంబున నాకొక గొప్పవిందు జరిగినది. ఇప్పుడియ్యెడ నింకొకటిగూడ సమకూడనున్నయది. కావున నిప్పుడే చని కాల్యకృత్యంబుల నిర్వర్తించుకొని కృతస్నాతుండనై వచ్చి విందారగించెదఁగాక. (నిష్క్రమించును)

భీముఁడు—(మణిభూషణునితో) ఓరీ! యీతూరి నీయసువులఁ బాసెదవు చూడుము.

(గదాయుద్ధము చేయును, మణిభూషణుఁడు పడిపోవును)

భీముడు—(నలకూబరునితో) ఓరీ! యక్షాధమా! ఇంక జూచెదవేల? నీవ చిక్కితివి రమ్ము.

నలకూ—ఓరీ, నీచమానవా! నీవేల యకారణంబుగ దురంబునకు దొరకొని ప్రాణంబులఁ బాపుకొనెదవు? మనసెంచితివేని తప్పు జేసితినని యొప్పుకొనుము. నీకభయదానం బొసంగి, నిన్ను మన్నించి పోనిచ్చువాఁడ. కాదేని,

మా॥ ఘోరతరంబగు మార్గణముల్ గొని • కూలఁగనేసెద జూడుము నిన్

భీముడు—అట్టులనా? చాలు చాలు.

మేరుసమాన బలాఢ్యుల నెందర • మేదినిఁ గూల్చితి దానవులన్
వారలకంటె భుజాబల విక్రమ • వంతుఁడవే నను మార్కొనఁగా
వేరె, ప్రగల్భము లాడఁగఁబోకు మ • దుగ్రగదాహతిఁ ద్రుంచెద నిన్

నల—భూరిపరాక్రమవంతుఁడ నన్నును • బోల్చెదె నీచనిశాటులతోన్
వారిని గెల్చితినంచు నన్గెలు • వన్గలవే? తులువా! కలనిన్

భీమ — వారలగెల్చుటకంటె నిన్నుఁ గెలు ◆ వఁ సులభంబు సుమా కనుమా
ధీరుఁడనంచు నీదిఙ్గొను గర్వము ◆ ద్రెంచెద, ద్రుంచెద, మించెద నిఁక॥

(అని యిరువురు గదల ద్రిప్పుచు యుద్ధము చేయుదురు;)

నార — (ప్రవేశించి, దూరముననిల్చి, తనలో) ఆహాహా! ఏమివింతు లేమివిందులు! సౌగంధిక కుసుమాధారంబున నాటిన కలహంపు మొలక పెఱిగి, పెద్దదై యిప్పటికి రెండుపంటలుపండి, నాకడుపు నిండించి నాకు సంపూర్ణముగఁ దృప్తినొందించినది. చాలును. ఇప్పటికే పొట్టయుబ్బిపోయినది. ఇంక మరొకఁ బోయితినా, గణపతికడుపువడువున విచ్చిపోవును. కావున నింక కలహంబు సమయింపఁజేయఁ జూచెద.

(నిష్క్రమించును.)

బ్రహ్మ — (ప్రవేశించి తనలో) ఈఘోరసంగ్రామంబుఁ జూడ నింతటితోఁ ముదముట్టునట్లు గన్పట్టదు. దీని నిట్టులనే విడిచిపుచ్చితినేని నారదుండు చెప్పినట్లు, క్రమక్రమంబుగఁ బాండవపక్షపాతియగు కమలాక్షునకును, కుబేరపక్షపాతియగు నసలాక్షునకును కయ్యంబు ప్రాసంగకమానదు. ఈశివకేశవులకు పోరు దారసిలిన లోకంబులెల్ల జీకాకునొందు. కావున నిప్పుడే వీరి సమాధానపఱుపవలయు. — (వడిగొన వారలమధ్యకు వచ్చి) వాయునందనా! శాంతింపుము. శాంతింపుము. కుబేరకుమారా! ఏమి యీ తెలివిమాలితనము? ఒక్క సిరజంబుకై మీరీరుసఁ బోరసేరయగునా? నలకూబరా! ఈతండు సామాన్యనరుండని తలంచితివి కాబోలు. ఈతండయ్యనిలతనయుండుసుమా! మఱియు నీకాప్త కోటిలోని వాఁడును నగు. ఎట్లంటేని,

గీ॥ తొల్లి శంభుండు శాంబరీ ◆ భిల్లుఁడగుచు
సూకరవేషంబునను వీని ◆ సోదరుఁడగు
ఫల్గునునితోడఁబోరి, యం ◆ త్యాని పటిమ
కలరి, పాశుపతంబిడి ◆ చెలిమిఁజేసె॥

(ధర్మరాజాదుల ప్రవేశము)

ధర్మజ—గంగానందనా! రణరంగమునకు వచ్చినారము. (ఆశ్చర్యముతో) ఏమది! పోరుచల్లారినట్లున్నదే? అకన్నట్టు నలుమోములవాఁ డెవ్వండై యుండు; కమలగర్భుండు కాడుగదా?

భీష్మ—ధర్మనందనా! సందేహమేమి! విరించియే సుమా! భీమ నలకూబరుల సమాధానపరుప వచ్చినట్లున్నయది. మనమును జని, వనజభవుని దర్శించి, జన్మసాఫల్యత నొందుదము. తొందరగ రండు.

అందరును—(చతుర్ముఖునిఁ జేరి) సరస్వతీశ్వరా! నమస్కృతు లొనర్చుచున్నారము.

(అని పాదములకు మ్రొక్కులిడుదురు)

బ్రహ్మ—కళ్యాణ్! కళ్యాణ్!

ధర్మజ—తమ్మిచూలీ! భవద్దర్శనసుకృతమ్మున మాదృశ పతితజనమ్ముల జన్మమ్ములు కిల్బిషహరమ్ములై, పావనతరమ్ములయ్యె.

బ్రహ్మ—మంచిది. (నలకూబరునిఁ జూచి) నలకూబరా! హేమసుమమ్ముల నీభీమసేనునకొసఁగి వాని సంతృప్తుం జేయుము. మఱియు నీధర్మరాజాదులకును స్వాగతంబొసంగుము.

నలకూ—చిత్తము. (లోనికేగి పూలఁగొనివచ్చి) అనిలనందనా!

ఉ॥ రమ్ము ప్రభంజనాత్మజ! కరమ్ము మనమ్మునఁ గ్రమ్మనిమ్ము నే
స్తమ్ము; దురమ్ములందలి విధమ్మును నీస్మరణమ్మునుండి పోఁ
జిమ్ముము; మిమ్ముఁ గంజభవుఁ జెన్నలరారఁగ నేడుజూచు భా
గ్యమ్ము నొసంగినట్టి కనకాబ్జము లియ్యవె కొమ్ము సమ్మతిన్॥

భీముడు—(అందుకొని) యక్షాధినాథా! భవాదృశ పుణ్యాసత్తముల తోడ నేస్తమ్ము సంప్రాప్తమ్మగుడు గడు ముదమ్ముఁ జెందితి. మిత్రునిగ గన్గొనినందులకు మీకు నా యనేకాభివందనములు.

నలకూ—ధర్మనందనా! గాంగేయాది మహాయోధవరులారా! యీాస
రసీరుహనెపమ్మున మిమ్మందర సందర్శింపఁ గల్గినందులకుఁ గడు
సంతసిల్లుచున్నాఁడ. మీాకందర కిదే నాస్వాగతము.

ధర్మ—భక్తిపూర్వకముగ గొంటిమి. బ్రహ్మానందభరితుల మైతిమి.

భీము—(ధర్మజునియొద్దకేగి) అన్నయ్యా!

క॥ మన్నింపుడు దురితాత్ముఁడ
నన్నా! ననున్, ముందు వెనుక ♦ లారయక యె. మీా
రెన్ని తెఱంగుల దెలిపిన
నన్నియు విననట్టిఫలము ♦ నందితి ననఘా॥

(పాదాక్రాంతుఁడగును)

ధర్మ—(లేవనెత్తి) సోదరా! ఇదియంతయు దైవయోగము. దాని కె
వ్వరేమి సేయఁగలరు? "బుద్ధిః కర్మానుసారిణీ" అను నార్యోక్తి
నెఱుంగవా?

భీము—(ఆతురతతో) పాంచాలరాజనందనీ! యిటురమ్మ. (ముందున
కు లాగికొని, పుష్పములఁదీసి)

ఉ॥ అంగన! నీవు నేను వన♦మందు విహారసుఖాబ్ధి మున్గుచో
రంగుగ నీకొసంగిన వ♦రంబున కత్తఱి నింగినుండి మేల్
బంగరుపుష్పమొండు ధర ♦ పైఁబడ, నంది, ముదంబుజెంది, క
న్నంగవకద్ది, తెమ్మని న♦నున్ దగఁగోరవె యట్టిక్రొన్ననల్॥

ఉ॥ నీరజనేత్రి! యెవ్వి నను ♦ నీపఁగన్, రఘురామ పాదపం
కేరుహభృంగమైతనరు ♦ కేసరిపుత్త్రుఁ, గుబేరసూను, వా
ణీరమణీమనోహరుని ♦ నెమ్మిగనుంగొను భాగ్యరాశిఁ జే
కూరిచె, నట్టి తమ్ములివె ♦ కొమ్మ మనమ్మలరారఁ గొమ్మరో॥

(అని పూవులనిచ్చును)

ద్రౌప—(తలవంచుకొని యుండును)

బ్రహ్మ—ద్రుపదరాజనందనీ! నీ వింకేద్దియైనఁ గోరుము.

ద్రౌప—వాణీప్రాణధవా! తమ కరుణాకటాక్షవీక్షణముదక్క యితర మేనొల్ల.

సహ—(ముందునకు వచ్చి) కమలసంభవా! అట్టులైన నీ భరతవాక్య మగుఁగాక!

గీ॥ వర్షముల్ కుంభవృష్టిగ ♦ వరలు గాక
ధాత్రి సస్యసమృద్ధయై ♦ తనరు గాక
జగతిజనములు సుఖులయి ♦ నెగడు గాక
ప్రభువు లన్యోన్యమైత్రిని ♦ బఱగు గాక॥

అందరు—తథాస్తు! తథాస్తు!

గద్య—ఇది శ్రీరమారమణ కరుణారసప్రసాదిత ప్రాప్తకవిత్వ, హారిత
సగోత్రపవిత్ర, శ్రీమత్కర్లపాలెము వంశపయఃపారావారరాకా
సుధాకర కామయామాత్యపుత్ర, సుకవిజనవిధేయ
కోదండరామ నామధేయ ప్రణీతంబయిన
భీమప్రతిజ్ఞయను నాటకము
సర్వము సంపూర్ణము.

మంగళంమహా శ్రీశ్రీశ్రీ

